# మొదటిమజిలి.



కర్త:—

శ్రీమతి పుట్టపర్తి కనకమ్మ.

# తొలి పలుకు

ఆగతించిన మహనీయునికి - ఒక కావ్యం కాదు - వెయ్యి వ్రాసినా చంద్రునికి నూలుపోగే అవుతుంది. ఆయన జీవిత తపస్సూ సాధించిన మహాఫలం - మన దేశ చరిత్రలోనే కాదు - ప్రపంచ చరిత్రకే - అత్యాశ్చర్యాలు. అనుహోన్నత తపశ్శిఖరాల్ని - మేమే కాదు — ఏకవిన్నీ అందుకోలేదు. కారణమేమంటే - మేము ఋషులు కాకపోవటమే. భారతజాతి - తన ఆంతరిక జీవనాన్ని ఒకసారి వ్యక్తీకరిస్తే - ప్రపంచమంతా దిగ్భ్రమ చెందే టట్లు — అలావుంటుంది.

పాఠకుల్ని మేమేమని కోరేది! చదివి ఆనందప డమనా? దుఃఖపడమనా? ఒక అనర్ఘరత్నాన్ని పోగొట్టుకొన్న జనులు ఎలా సంతోషిస్తారు? ఇక మా దుఃఖం యిదిగో చూడండి అనేదా? ఇంతమాత్రం దుఃఖం భారత దేశంలో ఎవరికి లేదు? కనుక - మేమేమీ చెప్పం. పాఠకులకు మా నమోవాకాలు.

ఈ పుస్తకానికి ఒకరిద్దరు మిత్రులు ద్రవ్యసహాయం చేశారు. వారిపేర్లు చెప్పటానికి మాకూ యిష్టం లేదు. వారికసలే యిష్టం లేదు.

సెలవు.

"పుట్టపర్తి దంపతులు."



# గాంధీజీ మహాప్రస్థానం.

ఆ॥ ఒకసుమమ్ము నందనోద్యానమందుండి
యిలకుడిగియె డెబ్బదేండ్లక్రింద—
అనుదినంబు క్రొత్తలగు తావులనునించి
వచ్చినట్టి త్రోవబట్టిపోయె॥

గీ॥ దానితావులతో సమస్తమ్ము జగము
గమగమాయించె- నొక హాయిరుగాలివీచె
మతమరావేశ- మంత సుమమ్ము వ్రాలె
సర్వమయు దివ్యపాదకంజములయందు॥

గీ॥ దానివాసన తోగూడ దశదిశాంత
రములు వ్యాపించె కీర్తిగానములు కూడ
కాని- జరిగినలోప మొక్కటియె దాని
నెలవులో - దాని సని గమనింపలేదు॥

గీ॥ ఎన్ని సుమములో భువి జనియించుగాని-
ఆసురభిళమ్ము పూవింక యవని లేదు-
మధుకరము లేడ్చులే - బిట్టు మసలిమసలి
వెనుదిరుగు నేమి? గడచిపోయినవి కలలు॥

గీ॥ ఎట్టిమధురాత్మల తపస్సు లివతళ్లించి
హైందవమతంబు పూజ్యతనందినదియొ -
యాఋషులచంపనే తయారైనజాతి
కిక ఘటించును లేకీర్తి యీజగాన॥

గీ॥ చంపె "జీసస్సు"నాడు పాశ్చాత్యజాతి
చంపె నవయుగ బుద్ధు ప్రాచ్యంబు నేడు -
అందుయిందన నేటి కెంద్రైనగాని
సత్యవాదులకును సుభిక్షంబులేదు - ॥

గీ॥ దివ్యవిజ్ఞానమున "బుద్ధదేవు" డతడు
చావుతోపోల్చుకొన్న "జీసస్సు" తండు
తొణకులేనట్టి గృహమేధి తనమునందు
నతని కెవ్వరు సాటిలే రతని కతడె॥

గీ॥ కిష్టబహుళ ప్రపంచ దుఃఖములు విడిచి
యడవులను జేరి - నిర్వాణ మందవచ్చు —
ప్రజలముఖముల మోక్షసంపదలు జూచి
యనుభవించిన మేటి తాతయ్యయొకడె॥

గీ॥ ఉచ్ఛలద్వీచికలు దేహమూపుచున్న -
జలధి హృదయంబు గంభీర శాంతిమయము -
నడచెడుసముద్ర మెక్కడున్నాడో? యింక -
యెవరువారికె పెద్దలీభువనమందు॥

గీ॥ అమృతమెట్లుండునన్న - తాతయ్యనోటి
పలుకుబడిబోలె - ననుటలవాటు నాడు
గరళమెట్లుండు - నన - రాజఘాటుమంట
పగిది - ననువాక్యమే పరిపాటినేడు॥

గీ॥ లలిత లాస్యంబులొనరించు పిలకతోడ
బోసినవ్వుల ముత్యాల పొలుపుతోడ
"తాత" లోకాలకెల్ల చిత్రంబునాడు
తాత జీవములేని చిత్రంబు నేడు॥

గీ॥ సార్వభౌముల పాశవశక్తి గూడ
మట్టిమల్లాడె నీజరామయము తనువు
దండిసత్యాగ్రహీ! నేడు ధైర్యమెడలి
నావహా! - మృత్యుదేవి బంధములనలిగి॥

గీ॥ నియమబద్ధంబయిన వాక్యనియతివోలె
ప్రవిమలానందమయము జీవనమునీది
ఉపనిషద్ఋషి! నీబోధలుర్వినింక
వివిధవ్యాఖ్యానములకు దావిచ్చునేమొ!

గీ॥ నేత్రనిటలున కాశివరాత్రినాడు
ఆమహాదేవియొక్క పుష్పార్చనంబు -
రమ్యభీకర శుక్రవారంబునాడు
"లలిత" కిదియొక కాశ్మీర లలితపూజ॥

గీ॥ సతతసంచార శీలియా "సమయపురుషు"
నాకలికి నదియిదియన నవధిలేదు -
"నియతి" యేమిచ్చునో దానినే భుజించు
నిత్యసంసార మదిసాగు - నేడు రేపు - ॥

గీ॥ హస్తమస్తకములు గల్గు నతనిజూచు
కలిమిలేనిది మన యభాగ్యంబుగాని
యంతమెఱుగనియట్టి నిత్యాత్ముడతడు -
విశ్వవిశ్వంబులను నడిపించునతడు॥

గీ॥ తల్లితనయొడి నిసుగుముద్దాడు టెంత
వరకు సత్యమో - దానంత వరకు గలదు
అమరజీవులకెల్ల భావాళితనువు -
వికలులై - యేడ్చువారలు వెఱ్ఱివారు॥

గీ॥ విశ్వమూర్తికి నొక్క "కోవెల"ను గట్టి
యందు నాదైవ మర్చించు నట్టుగాగ -
ఆమహాత్ముని సంసారమందుజూచి -
యనుభవించెడువారు - ధన్యతరమతులు॥

గీ॥ పువ్వుపువ్వుల పసిపాప నవ్వినపుడు
పవలురాత్రులు నియమాన వచ్చునపుడు
గాలియఖిలంబు జొక్కలగప్పునప్పు
డతనిదర్శించువారు - ధన్యతరమతులు॥

గీ॥ పరమగంభీరమైన - జీవనమునందు
కష్టసుఖములయందు నొక్కగతిమెలగి -
ఋషులగమనించి - జోతలర్పించువార.
లార్ద్రికల్యాణహృదులు - ధన్యతరమతులు॥

కీ॥ ఇట్టులుండగ వలెదోట - లీవిధాన
నిల్లనుచు - గోడకొని బొమ్మరిండ్లుగట్టి
యాడుకొను పసిపాపలట్లాడుకొన్న
ఋషికి - నొకపేరటాలు గల్పించుపూజ॥

గీ॥ తనకుగైవల్యభుక్తియంచని - తపించు
టదియునొకస్వార్థమే - దొడ్డదైనగాని
విశ్వహితమున కదియును వ్రేల్చినట్టి
ఘనుడు - తాతయ్యకేను వందనమొనర్తు॥

గీ॥ ఆటలోచేరి - తానాడు నప్పుడున్న
హార్షమది పైని గమనించు టందులేదు -
అవనితలమునడిగి - యాటలాడినట్టి
దైవతంబున కేను వందనమొనర్తు।

గీ॥ సృష్టియన వెఱ్ఱిజోగయ్య చేష్టగాదు -
గలదు - ప్రతిదానిలోనొక క్రమమటంచు -
చాటిపోయినఋషికి - శశ్వత్ప్రణామ
మాచరింతును - నిత్యసత్యైకనిధికి॥

గీ॥ అమితగాంభీర్యహిమవంతమైనగాని
యచ్చపుంప్రేమ పూవంతయైనవాడు
తాను - తనకొక్కనికె యర్థమైనవాడు -
ఘనుడు - పరమర్షికేనువందనమొనర్తు॥

గీ॥ ఎన్ని వెలుగులు భువి బ్రకాశింపనేమి
యర్కుడొక్కడే - నిక్కమైన వెలుఁగు -
యెందరుమనుష్యు లిల బ్రభవింపనేమి?
ఆమహాత్ముడొక్కడే - సత్యమైననరుఁడు॥

గీ॥ "నరుడెనారాయణుడు" నీయనంతశక్తి
నర్థమొనరించుకొని - లెమ్మటంచు—రాజ
ఘాటులో బల్కినట్టి యాకాశవాణి -
విన్నదెవ్వరో! వారె సంవిదులుజగతి॥

గీ॥ ఓయి! ఋషిపుత్రుడా! యెందుకోయికుందు!
చీకటితెరల హృదయాన జీల్చికొమ్ము -
ఆమహాత్మునియాశీస్సు లందికొమ్ము
బయలుదేరుము - బయటిప్రపంచములకు॥

గీ॥ ఒక్క బుద్ధుఁడు పుట్టి ప్రాచ్యోర్వికెల్ల
నలమికొన్నది - భారతీయంబు వెలుగు -
యీ మహాత్ముని దివ్యబోధామృతమున
నఖిలజగములు పూతంబులౌను లెమ్ము॥

గీ॥ అతని మృత్యువునూహించి యనదతనము
నంది - రోదించుటొక యభాగ్యంబు మనకు
ఉపనిషత్తులు మరణించునో! తదాత్మ
లైన పరమర్షులును - మృత్యువాదినాఁడొ!॥

గీ॥ అట్టిజీసస్సుచావలే - పట్టి బుద్ధ
దేవుఁడు - గతింపలే దట్టి దివ్యమూర్తి!
యీ మహాత్ముఁడు చచ్చునా! యన్నలార!
మనము మరణించితిమి వృథామలినమతులు॥

గీ॥ ఇతరులొనరించు తప్పునకెవ్వఁడేని
దన్ను దండించుకొనువాఁడు - ధరణిగలఁడొ!
పిచ్చివాఁడందుమా! మహావిజ్ఞుఁడాతఁ
డాతపస్సున నే సుఖంబందికొనునొ!

గీ॥ తమకుగనపడునది తప్పందదితరంబు
నమ్మమన్న దే - యీనాటి నాగరికత -
నేటిజాతికి ఋషులసన్నిధిని నిలిచి
సత్యమర్థించునొక యదృష్టంబు గలద!॥

గీ॥ చాటిచెప్పిరి మునులు విశ్వానురాగ
మొక్కటే సత్యమని - దాని నుర్వికెల్ల
యరచిపలికితి - మేమయ్యో? నరుగలేదు
మనకదే - సాక్షి నేటి దుర్మరణమొకటి॥

గీ॥ పోయినావుర! యొకదివ్య భూమికీవు—
నలువదియుకోట్ల మనసుల వెలుగు వెలుగ!
మరలరాకుండ బోయినావుర! చిరంత
నార్యఋషి సంప్రదాయము దాదు బ్రదుక!

గీ॥ కఠినశిలలకునైన నిన్నాంచినంత
హృదయముద్రవించునే! యొక్క యుదయహృదయ
మే ద్రవింపకపోయినదే! సైతాను
సృష్టిలోకెల్ల మనుజు డుత్కృష్టుడింక॥

గీ॥ క్రౌంచమరణంబు దిలకించి — కరుణకరుడు
గట్టి — యొకకావ్యమైన — నికృంపుజాతి
పరువు బరువెత్త లేదా! హృత్పద్మమందు—
నాకుటిలు — డొక్కఋషి తనువార్చునపుడు॥

గీ॥ పావురావచ్చి — తనహస్తపద్మమందు
వ్రాలుచో — మెచ్చి యాశ్రితావనముకొఅకు-
అంగమొసగిన శిబి సముత్తుంగ కీర్తి!
పోకదా! హంతకునిమనస్సున [illegible]వంబు॥

గీ॥ దేవతలు దన్నురీక్షింప దివికి— వచ్చి
నపుడు - దనచేతనున్న కాసంతజలము -
త్రోణకకిచ్చిన రంతిదేవుని యుదార
హృదయ - మా హంతకుని చిత్తమునను లేదా!॥

గీ॥ హైందవుడ! మానవునిజంపుటా! మహాత్ము
డగు మహర్షినా? నిర్హేతువుగన! అయ్యో!
హైందవునకిది యెంతటి యప్రతిష్ఠ!
మర్త్యునకిది యెంతటి యవమానభరము!॥

గీ॥ అదుగదుగో! పూలతేరు నందతనియాత్మ
యమరులెల్లరు చుట్టుకొన్నారలదుగో!
నడచుచున్నది రథము - మందారకుసుమ
వాసనావాసితంబైన పథమునందు—॥

గీ॥ అదుగదుగో! నవ్వుచున్నదాయాత్మ - దివ్య
హాసములు - తేనెసోనలు - కాసెపూలు
కవిసికొన్నవి - నవ్వు లాకాశమందు
పాలసంద్రంపు కరడులుపైకి లేచి।

గీ॥ అదుగదిగో! వెల్గుచున్నదాయాత్మ - వేయి
సూర్యచంద్రులు వెలిగెడి చొప్పుదోప
నిండెనొకవైపు ెగొదమవెన్నెలలచాలు
కవిసెనొకవైపు బంధూక కాంత కాంతి॥

గీ॥ అమరులార! మా తాత దీనాత్మ! వెనుక
కివ్వరా! భారతీయులకివ్వ! యెంత
కఠినహృదయులు - భువన శోకంబుమీక
బద్ధమైనదో! దయయను పదములేదా? ॥

గీ॥ ఎంతచల్లని తల్లివే మృత్యు! నీక
తండె దొరికెనా! యాకలి దలంగు కొరకు—
మన్నుగొని తినగూడ దేమమ్మ? మేము
సనిగ లేమమ్మ? ఘోరరాక్షసివిగదవె?

గీ॥ మృత్యు! ఒకపల్కు నాదాలకింపవమ్మ!
యతనివిడుమమ్మ! నీవొక్క ఆడుదాని
వా! హృదంతరమింత రాయైనదేమి?
నీకుదయ యెక్కడున్నదే నియతిబిడ్డ॥

గీ॥ ఊరికంతయు నొకయలంకారమైన
చెట్టుపడిపోవగా— కళచితికినట్టి
పల్లెవలె పాడువడిన దీ - భరత దేశ
మతండు లేనట్టిదాన ప్రేమైకమూర్తి! ॥

గీ॥ మధ్యమణిలేని యొకహారమందు నెన్ని
యున్న నేమి ముత్యాలు! లేకున్నయట్లె—
చుక్కలెన్ని యున్నను చంద్రుశోభవచ్చు
నా! తాతలేనికొరద తీరునా? జగాన॥

గీ॥ నాడు శివరాత్రి - నాడు సన్యాస్యచరిత
తల్లిగతియించె నామె జాబిల్లివలెను-
నేడుసూర్యుడే గుంకె - పొర్లాడు కటిక
చీకటులెయుంక - కనలేని జీవులింక॥

గీ॥ అప్పుడేయొక్క-గుడికట్టి యపుడె గెడపి
పారిపోయెడునొక పిల్లవానిబోలి
సృష్టియొనరించు - దోన నశింపజేయు
నాపరాత్పరులీల లత్యద్భుతములు॥

గీ॥ ఎన్ని పువ్వులు రాలవీయిలకు - నొక్క-
కుంద మేవ్రాలెనా? - వగ జెందుమనసు
ప్రతిదినంబెందరో చత్తురైన యొక్క-
గుణి మరించినచో - "కళుక్క-"నును మనసు॥

గీ॥ ఏకఘోరముహూర్తాన యిల్లువీడె
నోమహాత్ముడు - యొకదుష్టుడాముకొని యె
ఆతడెరుగడా? తనచావు కద నటంచు
నాత్మనిష్ఠులకొక యనూహ్యంబు కలదె?॥

గీ॥ భవ్యమైన నిర్వాణతల్పంబునందు
పండి - యున్నట్టి - యొక్క-దివ్యంబు వెలుగు
గాంచుచుందురు మోక్షలోకంబులందు
నిత్యముక్తులు - శాంతి సన్నిహితమతులు-॥

గీ॥ రామరామయటంచు మంత్రస్వరాన
విష్ణుదలచుచు బ్రాణముల్విడిచె నతడు
తానుగాకున్న రాముండి తరుడుగలడా!
"యద్యదాచరతిశ్రేష్ఠ" యనగ వినమె! —

గీ॥ పరమ లక్ష్మీప్రదము శుక్రవారమనుచు
నింతవరకు హైందవజాతికెల్ల గుఱుతు
నేటికది కటుదుఃఖసంకేతమయ్యె
జాతిరవిఁగ్రస్తమించె దత్సాధ్వ్యయనుచు॥

గీ॥ మానవుఁడు మానవుఁడుగాక - మర్త్యరూపుఁ
డైన భగవంతు చంపనే - బూనెననుఁడు
ముప్పదియుమూడుకోట్ల నభోవిటంక
చరులు - దేవతలును బ్రోవజాలరైరొ? ॥

గీ॥ ఆసురనికథలోఁబోలె యాయువొసఁగి
దెచ్చుకొనవచ్చునేని మాదివ్యదీప్తి —
లక్షలకు నాయువిత్తురెవ్వైన - నెవ్వ
రైన మాటాడరయ్య! దేవాళితోడ! ॥

గీ॥ హిమవదచలంబులో శిఖరములయందు
తపమొనర్చెడి మానిమూర్ధన్యులార!
పోవుచున్నాడు - పోయె - రాబోడు - రండు
వచ్చిప్రబధికింపు డిపుడు తపఃఫలాన॥

గీ॥ రారుగామీరు! లోకకల్యాణమునకు
మీతపముగాదొ? పలుకరే మీ! తపస్వు
లార! యజ్ఞాన బద్ధ మర్త్యాళిఁగుఱి వి
నవ్వకొందురో? శాంతిసంబద్ధ మతులు!

గీ॥ తెలియుకడుగుడు - శాంతియందినమహాత్ము
లకును మనసుండదా? దయాలవము లేదా?
ఉన్న దానికి గుర్తు లేమున్న విపుడు —
పలుకరే? కోటిగొంతులు పిలువనైన॥

గీ॥ సర్వసములైనయట్టి పర్జన్యమూర్తి
కొకట బ్రేమంబు - పగ మరియొంట గలదొ?
యైన నిక్కడ గురువలే దక్కడ గురి
సైనని తరమెంచు - స్వార్థ దంభనముజగము॥

గీ॥ కలలవలె నెన్ని మార్పులు గలుగుచున్న
శాంతిపీఠకనిలుచు స్వచ్ఛందహృదయు -
లకు - పరాత్పరు రూపంబులకు - ఋషీంద్రు
లకు "చిదానందరూప కల్యాణమస్తు" ॥

గీ॥ అవధి - దేహంబు మరణింప నైనగాని
యాత్మ మరణింప దన్న సత్యంబు దెలిపి
జగతికెల్లను ధైర్యంబొసగినట్టి
వారి - కాత్మరూపులకు నావందనంబు॥

గీ॥ ధర్మమేనాడు వాడి - యధర్మమెపుడు
బలియునో - యప్పుడే పరాత్పరుడు దన్ను
దాన సృష్టించుకొనెడి యాథార్థ్యమూది
చెప్పినమునీంద్రులకు - జోతలప్పగింతు॥

గీ॥ రక్తమాంసంబులనుగూడి వ్యక్తమైన
దేహములఁగాక - తలఁపుల దీప్తి జూచి -
యామహాత్ములు "చెడనివార" ని భజించు
సత్త్వమహితులకెల్ల వందనమొనర్తు॥

గీ॥ కలశరత్నాల చంద్రికావలయ మధురి
తంబయిన - రాత్రివేళవిధాన - దివ్య
జీవులచరిత్రలో సొమ్మసిల్లిపోవు
లలితవీణాహృదులకు నంజలిఘటింతు॥

గీ॥ కష్టములు గల్గినపుడు హుంకారముననె
దెమలుకొని - యత్మశక్తి గుర్తించికొనుచు—
యడుగు వెనుకకు వేయక యరుగునట్టి
ధైర్యధనులకు వినయవందనమొనర్తు॥

గీ॥ "బ్రతుకు బ్రదుకనే" యను నసంబద్ధమైన
వాదువిడి - జీవనముల యబద్ధమైన
కోమలమగానముగ (గూర్చికొన్నయట్టి
యిద్ధులగు తపస్వులకెల్ల నేటికోళ్ళు॥

గీ॥ సృష్టియందెల్ల నుత్కృష్టుడైన
భూతసంఘంబుపై సానుభూతిగల్గి
దయానుపాసించు ధర్మతత్త్వైకనిధుల
కమర జీవులకును బ్రణామము నొసర్తు॥

గీ॥ చీమయాదిగా నొకమహాశిఖరివరకు
నాపరాత్పరునకు దేహరూపమనుచు
దలంచి సేవలుగావించు ధన్యమతులు
కబ్బునిర్వాణపద మంద గన్నవారు॥

గీ॥ ఆమధురమూర్తి - యొక్కనాండైనంగాని
మఱచెనా! బుద్ధదేవుని మహితసూక్తి!
మఱువవందుల కుపకారమా! శరీర
మాకళించిన పానుతుపాకి గుండు॥

గీ॥ అది బడుగుదేహమే! యెంత యలంతబడెనో!
యేమితలపోసెనో యప్పుడెడంద! "రామ
రామ" యనుమాట సుందరాస్వామృతముగ
నిండినది - చాలులే - నోము పండిపోయె॥

గీ॥ ఎన్నికార్యముల్ చేసినా! యెన్నిసుఖము
లనుభవించినా! యొక్కటి యనుగమింప
దా మరణకాలమున యందు - నాత్మభక్తి
యొక్కటే తప్ప - రఘువీరుండొకండు దప్ప॥

గీ॥ మెదడునే నమ్మి లోకంబు - హృదయహీన
వాదములఁద్రవ్వుకొని మదిఁబ్రమసి - కాల
పురుషునకు నోరికండమైపోవుగాని
తలపదే! రఘువీరుపాదాబ్జములను॥

గీ॥ తాత భౌతిక మూర్తి కాధారమైన.
దండమట్టులె - యాత్మకాధార మొకటి
మధుర నామామృతంబని మఱువరాదు
దేశమిక నైన - ధర్మని వేశనంబు - ॥

గీ॥ ఆస్థితప్రజ్ఞుఁడుత్పత్తియైనయపుడె
తీసికొనివచ్చెనా! యోగదీక్ష! దైవ
భక్తియెంతెంత పనులుదీర్పంగ లేదు!
ఋషితనూజులు - మదిగమనించికొనుడు॥

గీ॥ నాఁడు వామనమూర్తి యంతంతయగుచు
ఘనపథంబెల్ల నాక్రమించిన విధాన -
ఆపరాత్పరు భక్తి కాత్మార్పణమున
ధన్యుడైన - తాతది - జీవితంబు గనుడు॥

గీ॥ పాశవ విదేశనాస్తిక వాదకర్షి
తాత్మమై - పతనోన్ముఖంబైనయట్టి
దేశమునకిది కడపటి దీప్తియగునో
కాక - నూతనరుచికి శ్రీకారమగునో! ॥

గీ॥ కాదు లే! ఋషిజాతి యఖండమగు - త
పస్సుతో భారతాకాశ పథము నెల్ల
నింపి వేసిన—దిందుజన్మింపబోరు -
మూఢమర్మాన విలులిత బుద్ధు లెపుడు॥

గీ॥ ఒక్క-బుద్ధునితో భారతోర్వి వేయి
వత్సరంబులు మానవత్వము ధరించె -
యింక జీవింపదేమి? వేయేసి వత్స
రాలు - నవయుగబుద్ధు తీవ్రంబు తపసు!॥

గీ॥ నేడు - మరునాడు కొన్నికన్నీరువిడిచి
మఱచి పోరాదు - సముదితాత్మలను మనము -
వారుచూపిన వెల్గుల బాట నడచి -
దివ్యభూమిగా దేశంబు దిద్దవలయు॥

గీ॥ జ్ఞాన పథమెప్పుడును సుగమమ్ముగాదు
అలతితోగాదు తుంగభావార్చనంబు
జ్ఞానపథము కంటకకీర్ణమైనత్రోవ
తుంగ భావార్చనము బాధతోడి తపసు॥

గీ॥ సిళ్ళు సూపిన కరులు కరుళ్ళు గట్టి -
కష్టములుపైని బడవచ్చుకాలమందు
చతురులై - వానిదాటు విజ్ఞానఘనులు
ఋషులు - వారలగొల్చు నప్పనముజగము॥

కర్మసిద్ధాంతమున మూఁతిగంటువెట్టి
స్తబ్ధుఁడైనచో వెఱ్ఱివేదాంతిగాక
జ్ఞానసూర్యుఁడువాఁడా! విశ్వంబునందు
సలుపవలె కర్మ - యుపనిషత్తుల హితోక్తి॥

గీ॥ తమము గవిసిన సోమారితనముకంటె
రాజసికమైన కర్మగోరగదగినది
సాత్త్వికము కర్మసర్వాతిశాయి - లెండు
భరతపుత్రులు సత్క్రియా పరులుగండు॥

గీ॥ హరిజనులుమీవలెనె మస్తహస్తములతో
యున్నవరులని జ్ఞాపకముంచుకొనుడు
విశ్వమెల్లఁ బ్రేమించిన విమలమతము
మీది - మదులందు నీ సత్యమూదికొనుఁడు॥

గీ॥ ప్రేమతో గౌరవము సమర్పించుగాని
"జులుము"తో నరుడెప్డు - వశ్యుండుగాడు —
సరిగగమనింపవలె నగ్రజాతి - వచ్చె.
వచ్చెవిప్లవ మదిగో! దావాగ్నివోలి॥

గీ॥ యుగయుగాలుగా విజ్ఞానమొగినిమాదె
యనుచుగూర్చున్న మర్త్యులారా! చిరంత
నార్యఋషులెల్ల కరుణామయాత్ములయ్య!
పంచుడెల్లెడ - దివ్యభావములఁ మీరు! ॥

సీ॥ త్యాగగుణమొక్కటే యమృతత్త్వమునకు
చాలుననుమాట - మేటి వరాలమూట—
అక్షయంబగు విజ్ఞాన భిక్షయిడుడు
అదియె పరమర్షులకునెల్ల నాత్మశాంతి॥

సీ॥ మార్పురాగూడదనిగాదు - మార్పువలన
మంచియో! చెడ్డయానో యోచించవలయు,
నవనవంబైన పాశ్చాత్యనాగరికత
"కాగితపు పూలమాల" జాగ్రత్తపడుడు॥

సీ॥ పరమసత్యంబు - గొప్ప తపస్సహింస
సర్వధర్మంబులకు మూలసారమివ్వి—
జీవితంబులయందు బోషించికొన్న
సర్వవిద్యలకడమాట చదివినట్లు॥

సీ॥ తులసిరామాయణంబు పిచ్చిలరసంబు
బైబిలు ఖురాను దైవసంభావ్యవాక్కు—
సదమలంబు గీతాజ్యోతి జ్ఞానపరిధి
యనుదినము దేశమున పూజలందుగాక! ॥

సీ॥ ఆమహాత్ముని పూతయోగాగ్నిపక్వ
మై - స్వరసమైన యట్టి సారస్వతంబు
ప్రతిహృదయ మందు నార్పగరానివెలుగు
గా - ప్రకాశించుగాత - ప్రకాశమొంది॥

సీ॥ భౌతికంబైన దేహమే భస్మమైన
దజరమమరంబు వానిదివ్యాత్మ - యద్ది
సకలమానవదేహ యష్టికల నిలిచి
కోమలప్రవృత్తులకు బుంగొల్పుగాక! ॥

సీ॥ పరమకారుణ్యరూపుడై - నరులయెదల
నిలిచి యెవ్వాడు భువి గరుణించు చుండు
అట్టినిర్వాణరూపున కనఘమతికి
కంటి కన్నీటి ముత్యాల కానుకలివిగో! ॥

సీ॥ సర్వజీవుల హృదులలో శాంతిదాంతి
రూపుడైనిల్చినట్టి యరూప్యమూర్తి
కాత్మతుష్టి ప్రసన్నాస్యహాస వికసి
తాత్మునకు - వందనంబు సత్యైకగతికి ॥

సీ॥ దివ్యఋషుల శుభంకరాదేశములను
పుడమిదిగివచ్చి - ధర్మముద్బోధచేసి
మోక్షమొందిన యానిత్య ముక్తునకు మ
హాపరిధికిదె - ముగ్ధ బాష్పార్పణంబు॥

సీ॥ ఆరమణిలక్ష్మి - నిజము - కస్తూరిబాయి
అతడు నారాయణుండె మాయావినోది-
యిరువురు పురాణ దంపతు లిందుపుట్టి
నందుకే - కర్మభూమి యన్నారు సురలు॥

గీ॥ అతఁడు గతియింపనేరఁడీ యఖిలజనుల
యాత్మహృదులందు నిలిచి యున్నాఁడు - వాని
తపముచేఁగాని తెలియ సాధ్యంబుగాదు
తపమొనర్పుడు - ఋషుల సంతతులుమీరు॥

గీ॥ తనకు ప్రియమైన గోవువిధాన - దేవ
తావళికి నెల్ల నాధార మైనవాఁడు
అరిగి యరుగనివాఁడు - ప్రేమాభిధాను
డీ సమస్తమ్ముజగము పాలించుగాక!!! ॥

# హే గాంధి దేవ!

(1) సాయంప్రఫుల్ల నవకుంద సమానహాస
రోచిస్సుధా స్నపిత మంథర కమ్రమూర్తే!
నిర్వాణలోక తరుణారుణ! దీనబంధో!
హే గాంధిదేవ! శిశిరీకురు లోచనం మే—

(2) వర్ణప్రభేద దురహంకృతి దగ్ధలోక
సంజీవనైకచణ కాంత కటాక్షపఙ్క్తే!
ఆనందపాంథ! పతితాఽవనబద్ధదీక్ష!
హే గాంధిదేవ! శిశిరీకురులోచనం మే—

(3) నిందాఽభిరామ సుమమాల్య పరిష్కృతాంగ!
నీరంధ్రధర్మ సరసీరుహ రాజహంస!
ప్రేమాఽవతార! నిరవద్యకృపైకతీర!
హేగాంధిదేవ! శిశిరీకురులోచనం మే—

(4) సాహస్రవర్ష సమనంతర దివ్యదేహ
స్వీకారపల్లవిత మధ్యమలోకవృత్తే!.
హేబుద్ధదేవ! కరుణామధురాఽనుభావ!
హేగాంధిదేవ! శిశిరీకురులోచనం మే—

(5) శాంతి ప్రసాద మధురీకృతలోచనేన
జ్యోత్స్నా తరంగపటలీతరళ స్మితేన—
కారుణ్యభావచులుకీకృత మానసేన
హేగాంధిదేవ! శిశిరీకురు లోచనం మే—

I

ఓయిమహర్షీ!
ఎక్కడికెళ్ళావయ్యా!!
ఏపాశవిక దేవతల అనంతాశలు - నీడలై - నిన్నుకవుసుకున్నై
ప్రపంచంలోని సర్వమానవుల వ్యతిరేక భావస్పందనాల్నీ
జయించివేశావే!
ఒక్కమృత్యువునేజయింపలేకపొయ్యావా!!!

ఓయితాతయ్యా!
వినపడటంలేదూ— ఈనలభైకోట్ల కంఠరవాలు!
వినపడ్డా— వినపణ్ణట్లున్నాయా?
అనంతనిర్వాణసాధనలో —
అనుభవంలో —
మమ్మల్ని— ఒక్కక్షణమైనా మఱచిపోవేనీవు!
ఈనాడుమరవటం —
మాఅభాగ్యం కదూ!!!

దండిసత్యాగ్రహీ!
ఏదీ ఆరూపం!
ఆప్రతిచలనంలో—
అనంత అగ్నిపర్వతాల కూడగట్టినరూపం!!

ఈనాడు—
ఈమట్టిలో నిద్రపొయ్యావా!!
యింతేకదూ!!!

అబ్బ! ఏమిజీవితం!!
ఆమనిషిలో అనుక్షణం పదివేల దేవదత్తాలుమ్రోస్తినె
ఆయనబ్రదికికల!—
చచ్చినాకలే!!!

---

II

ఎవరది?
బాపూజీ మరణమా?
ఛీభ్రష్టా!
పో! అవతల

ఆయనమరణిస్తే—
ప్రపంచమే మరణిస్తుంది!—
ఆ!... నిజమన్నారా!
ఓ!... ఇదేమిహాహాకారుగాలి!!

మానవులే ననుకున్నాను—
అన్నిపదార్థాలూయేడుస్తున్నె

ఏడ్వండి—
బాగా యేడ్వండి—
గొప్పవాళ్ళు పుట్టిపోయినాకా—
ఏడ్వడమే ప్రపంచంవంతు:—

———

III

తాతయ్యా!
యెంత యేడిస్తేనేమి!—
నాకన్నీళ్ళల్లో ఒక్క-కణంకూడా—
నీపాదాల్ని స్పృశించలేదని తెలుసు—

ఎంతఅరిచి మొత్తుకుంటేనేమి!
నాఒక్క-ధ్వనికూడా—
నీ నిర్వాణ ప్రపంచాల ప్రాకారాల్ని
తాకలేదని తెలుసు.

ఎంత!
ఎంత చేతులు పైకిదాస్తేయేమి!
ఆనీవుపోయిన దూరంలో—
కోటిభాగాన్నైనాకప్పుతాయా!!

అయినా యేడుస్తాను.

ఒక్క పురుకీ—

నీచాతి నీచుణికీ—

నీమనమణ్ణనే గౌరవాన్నిచ్చావ్

అదింక లేదుకదూ!!!

---

## IV

అదిగో!

ఆపక్కింటి పిల్లనీచూడూ!

ఏమిటాకన్నీళ్ళు!

తాత అర్థమైనట్టూ!!

అదిగో ఆగోవు!

తోకనైనా ఆడించటంలేదు!

ఏమిటాదిగాలు!!

తానూ మానవుడైనట్లూ—

అదిగో ఆపువ్వూ!

వాడివత్తైపోయింది

ఏమానీరసం!

తనకూమనసున్నట్లూ—

ఓ!...

స్థితప్రజ్ఞులచావు—
ఇలావుంటుందేమో!!

---

V

ఎవరీనిద్రాణప్రపంచంలో—
అలానడచిపోతున్నారు!!
అవును— ఆయననిత్యపాంథుడు
ఆకాలికిందపడిన ప్రతిభూరేణువూ—
సుధాకణమౌతుంది!—
ఆయనగాలిసోకిన ప్రతివస్తువూ—
ఆత్మానుభూతిలోతుల్ని
అందుకుంటుంది!—

అయినా—

ప్రపంచం—
ఆభూరేణువును అంటదు—
ఆగాలికి దగ్గరపోదు—

ఎవరీశిలాప్రపంచంలో అలాపాడుతున్నారు!!!
అవును— ఆయననిత్యగాయకుడు

ఆకంఠంలో—
అనాది సౌందర్యాలు పలుకుతై!—
ఆకన్నుల్లో—
కోటికామధేనువులపాలు—
ఒలుకుతై!—

అయినా—

ప్రపంచం— ఆగానాన్ని వినదు
ఆకన్నుల నీడలకేసి చూడదు;—

ఎవరీవిషాదప్రపంచంలో—
అలానిత్యసంతోషి!—
అవును— ఆయనదివ్యమానవుడు
ఆమాటలనిండా—
తొలినాటివేదాలూ!—
ఉపనిషత్తులూ!—
ఆనవ్వులనిండా—
అనంతసాగరాలూ! —
కోటిచంద్రులూ!—

అయినా—

ప్రపంచం— ఆమాటల్ని అందుకోదు—

ఆనవ్వులో మునుగదు
ఆయన వస్తూనేవుంటాడు—
పోతూనే వుంటాడు—

ఉన్నప్పుడు—
ప్రపంచం పలకరించదు
పోయినాకా—
ఆపాదముద్రలకి గుళ్ళుకడుతుంది!

---

**బాపూ !**

నీవుపోనేలేదు!!
నీవుపోయ్యావంటె
నిప్పుతెరలై లేచు
నిత్యయావనమూర్తి!
నీవుపోనేలేదు!!

చంద్రుడెప్పటివలెనె—
దివివెలుగుతున్నాడు
తారలెప్పటివలెనె—
తళతళాచిమ్మినవి

అతడు క్రుళ్ళనెలేదు
అవిడుల్లనేలేదు
　　నీవు పోనేలేదు!!

లోకాలులోకాలె
చీకట్లు క్రమ్ముకొని
ఆకళింపనెలేదు
అవని అంతాగూడ
　　నీవు పోనేలేదు!!

ఆకు ఆకునసీవు
అడుగడుగునానీవు
అమరసన్నిభమూర్తి!
అన్నికడలానీవు
　　నీవు పోనే లేదు!!

అవిగో!

　　అవిగవిగో! అవిగో!!
అవిగో! మహాత్ముర క్తపుకణములు
త్రిభువనపావన

గంగాజలములు
అవిగవిగో! అవిగో!!

అవిగో! మహాత్మునెత్తుటిచుక్కలు
జినమునియమృత
స్నపితాక్షరములు
అవిగవిగో! అవిగో!!

అవిగో! మహాత్మ శోణితధారలు
కుపితమహేశ్వర
క్రోధజ్వాలలు
అవిగవిగో! అవిగో!!

అవిగో! మహాత్మురుధిరవీచికలు
శతభారతోర్వి
శాపజలమ్ములు
భగభగమండే
భరతాపయశో
బలివేదికపై—
చిలికినవవిగో!
అవిగో! మహాత్మునెత్తుటిచుక్కలు—

ఏరుకోండి - ఏరుకోండి
ఎడారిపోలిన హృదయాలందున
ఏమైనా — దయలేనిపిశాచులు —
ఏరుకోండి - ఏరుకోండి

కలకాలము మీ బ్రతుకులమండే
కలిరాక్షస భావజ్వాలలబడి —
బలియైపోయిన మాతాతయ్యవి
భవ్యాస్థికలను— మీగంటువలెనె
దాచుకోండి — దాచుకోండి

బ్రతికిన దినాల పలుకకపోయిన్యా —
బాధించిన ఘటికులు— భేతాళులు —
చచ్చినకన్నులు చేరెడేసిలే!
జబురుకోండి - జబురుకోండి

ఆక్రీస్తూ— ఆబుద్ధుడు
అన్నీ ఒకటై కానుపించినా —
అదవ జీవిగా — ఆక్రోశించిన
కుదిరెలు - నలభైకోట్లరాక్షసులు
కవుసుకోండి - కవుసుకోండి

బల్లేలూ — పిడిబాకులు —
బ్రతుకంతా — రక్తమయం
చరిత్రనే — పిత్రృవనముగ జేసిన
చవటలు — వీరులు భారతజాతులు
మూగుకోండి — మూగుకోండి

ఏమర్రోయ్! మీా తెవ్వులూ
యింకా కక్కసమేనా?
చచ్చినగానీ — పగలేనా?
సరిలే! ఎందరితినలే
దభములు — ఆకలితొత్తులు
లాగుకోండి — లాగుకోండి

ఆయన అస్థులతోటే —
అన్నీ బాకులుచేస్సీ —
అన్నదమ్ములిరువైపుల
అలమి గుమ్ముకొంద్రుగాని
యేరుకోండి — యేరుకోండి

---

[ఇది ఈనడుమ జరిగిన "బాపూజీ" అస్థికల నిక్షేపాన్ని ఉద్దేశించి వ్రాసింది కాదు. ఆశుక్రవారమునాడే దీన్నివ్రాశాను.

ఆయనబ్రదికినప్పుడు పలకరించకపోయిన లోకంపైనవుండే ఘృణాత్మకమైన ఒకభావచిత్రము మాత్రమే దీనికివిషయము.]

మ॥ పురుగుంబుట్టయుగూడ నీకరుణ కెప్డుం బాత్రముల్ — నుత్తకా
పురుషుండొక్కఁడు బొట్టఁబెట్టికొనె "బాపూ!" నిన్నుమా హైందవా
ర్వరలో — జన్మమునెత్తె నేటికొకడప్రాచ్యుండు — పాశ్చాత్యక
ర్కరవిద్యా — తదపూతనాగరికతాకారమ్ము సప్రాణమై.

మ॥ అలహైమాచలమాది సేత్వవధిగా నంతాచితాధూమమే
యలమెన్ — దేశముదేశమే మరణమైనట్లున్న దీనాఁడు — పూ
వులలోఁ దావులులేవె — గాలులరవంబుల్ దీవ్రసంవేదనా
కలితంబుల్ కవికంఠ వల్లకులు గాద్గద్యంబుతోఁ గుంగెడున్॥

చ॥ మాటకు మాటకున్ గుదులుమంటలు — చిత్తము తీవ్రవేదనా
పాటితమైనదీయెడ నుపన్యసనంబా! విమర్శనంబా! స
య్యాటలా! యేమి భారతమురా! విష మెుక్కఁడి యగ్గివవ్వులే
నాటికి మానదాజగము! నాలుగుకోటులు దివ్వెలారినన్॥

శా॥ ఎన్నేండ్లాయెనో! బుద్ధుఁడేగి — యతఁడే యీనాటికిన్ "తాతగా
నున్నావ"ంచని బిడ్డకున్ గుటుతు నీవుర్విన్విసర్జించుచోఁ
గన్నీరోడ్చని రాతిగుండెగలదా? గాపట్యదౌర్గంధ్య సం
పన్నుల్ నేరరుగాక! సర్వమయరూపా! శాంతిదూతా! ప్రభూ

చ॥ నలువదికోట్లతండ్రి! చనినావా నిజంబుగ! "రాజఘాటు" భూ
ములశయనించితో! భరతపుత్రులు బండినచోట — నీవువా
రలవలె నొక్కవీరుఁడవెరా! బుతఖడ్గమువట్టి — లోకపం
థలకెదురొడ్డినిల్చితి వతంద్రత — ముప్పదియారు వర్షముల్॥

చ॥ శిలలకుఁ బూజఁజేసితిమి—చెట్లకుఁజుట్టితి మెన్గులల్లె పెం
పెలసిన పాత్రముల్ నెమరువేసితి—మీాధరకెల్ల మేమె వి
జ్ఞులమనిపొంగిపొంగితిమి—శూన్యులమై కడకొక్క-మాత్రలోఁ
గలఁచి వధించివైచితిమి—గన్నులు చల్లగనాత్మ తత్త్వముః॥

శా॥ తాతా! యెన్నిదిరాత్రులేగినవి—వార్తాపత్రికల్ ప్రార్థనా
స్ఫీతోక్తుల్ బ్రకటింపమానినవి—యే వేయేండ్లకో యింకనీ
మాతృప్రేమ సుధాస్రవంతికలు! - యీామధ్యాహ్నకాలంబులో
యాత్రాయాతములౌను—పాశవిక సంహారాలు—రక్తాన్నముల్॥

మ॥ దిననాథుండిదె గ్రుంకినాఁడు మరలాదీప్తిస్ఫురన్మూర్తియై
వినువీథిః నడతెంచుఁ బ్రొద్దుటనె—నీవేనాకుసందేహ మా
తనివెన్వెంటనె లేచిరార జగదాత్మా! నీవు లేవట్టి సూ
ర్యునితోఁ జీకటులింకునా! యెటుకమాయుంగాక భాసించునా!

మ॥ పలుకుందోడును లేక దీర్ఘతమమౌ బాటన్ప్రయాణించు కే
వలుఁడౌ పాంథునివోలె—సత్యమహితాధ్వంబందు నేకాకిగా
వెలుగుందారులఁ బట్టిపోయినతపస్వీ! యింక నెన్నాళ్ళకీ
యిలకుఃడిగ్గెదవోయి! దాల్తువపు డే యేగుర్తులః దెల్పరా!

గీ॥ తాతా! ఓతాతా! నీ
ప్రేతముకాలినది దుఃఖవీథులలో—శో
కాతుర హైందవకీర్తి
ప్రేతముకాలినది—భాగ్యవీథులలోనః॥

శా॥ ఎంతో చెప్పఁదమన్న యూహ కలదోయీ! చిత్ర మేభావమో
యంతఃస్రోతసి నడ్డుకట్టినది — వాగ్వ్యాపార మేలేదు; దు
ర్దాంతప్రక్రియ నీడ్చినన్ నడుకులై రాపాడు — లోలోననే
చింతావీణ నదించుచున్నయది — నిర్జీవంబులౌ రాగముల్.

చ॥ ఒకపని చేయఁబోవ మరియొక్కటిదోచెడు — నొక్కటాడఁగా
వికలము శబ్దమింకొకటి విన్చును — మాటలు లేని కైత తా
వకకృతి యోగ్యమన్న పద బంధముదట్టును — మచ్చలేని ప్రే
మకు — మురిపిచ్చికిన్ సరిసమానము లాంతరిక ప్రవర్తనల్॥

శా॥ నీవా! పోతివి — రాజకీయములలో నేదప్లు నీబిడ్డ లం
తా! విశ్వంబున మంచిచెడ్డలకు సుంతా భేదమే లేదు — మా
భావి శ్రీభవదీయహస్తముల తోట్పాటొంది వెల్గొందు నం
చేవో యాసలు! అన్ని పూర్తియయి పోయెన్ నేడు నీచావుతోన్॥

శా॥ ఏవో గీతిక లాకసంబున గుమాళించెన్ — సురస్త్రీల వీ
ణానాదంబులు గాగనోపు — నదికన్నా! యెంతహర్షంబు మా
దైవంబున్ గ్రసియించి! దేవతలు పూతాత్ముల్గదా! కా దసూ
యావేశంబులు వారికిన్ గలవు — సత్యంబయ్యెపో నేటికిన్॥

శా॥ * ఈగోరంటలుఁ గూడముడ్చికొనిపోయెన్ — యెట్లుగుర్తిం
చెనో!
త్యాగైకాత్ముని మృత్యువార్త! వడకుందా మేల? యెంతున్నదో
యోగన్ రాని విషాదమీసరుల కన్నా పుష్పవల్ల్యాదులే
త్రైగుణ్యంబుల భావపుంజముల నారాధించు సంపూర్తిగన్॥

---

* మాయింటిముందు చిన్న గోరంట చెట్టువున్నది.

శా॥ ఈసంకల్ప వికల్పయుద్ధములు మాయేరమ్మదమ్మ్మల్—బుత
మ్మేసర్వాతిగమైనశక్తియని ప్రేమాయించెన్ సుధాభేరి—తా
నాసత్యంబునకొగ్గి మేనువిడినా డంతా ఫలంబొక్కటే!
యేసిద్ధాంతము నమ్మినన్ కడకుచావే—సామ్యవాదంబులే!

మ॥ వరుసల్దీరిన వర్థిబృందములు భావస్విన్న నేత్రంబులన్
పరమాన్నంబులఁద్రావి త్రేన్చుటకు—నాహ్వానంబుగావించిన
ట్టి రసస్నిగ్ధుడు—యింటిగేస్తు మొదలేడీ? లేనియీచింతయె
వ్వరికిన్పట్టినదాత్మసౌఖ్య పరిలుబ్ధంబైన లోకంబునన్॥

శా॥ శ్రీరాముండవనిన్ త్యజించినపుడేడ్చెన్ భూతసంఘంబులం
చేరోజోపఠియించితిన్—తలఁచితుత్ప్రేక్షోక్తిగానాత్మలో—
యీరోజేడ్చిన వన్నిభూతములు—నాయీగుండెలోనిల్చి ధా
రారూపంబుగ-తద్వచస్సులు సమగ్రంబిప్డు గన్పించెడిన్॥

శా॥ నీసిద్ధాంతము తర్కసమ్మతముకానీ—కాకపోనీ—పశు
వ్యాసంగప్రవిలీన లోకజనతాపాఽఽచాంతి పీయూషధా
రాసంపాతము—నీవుపోయినపుడెల్లం బోయినట్లయ్యె స
ర్వాఽసుప్రాంగణదీపవర్తి! యికదీపంబన్నదే లేదుపో!!

మ॥ 1అవతారంబవుదో! విభూతివో! సమగ్రానంద నిర్లిప్తుఁడో
2కవివో! బుద్ధికనూహ్యమౌ జటిలతర్కగ్రంథివో! కాక-క
ర్మవిలాసంబుల 3వృద్ధిజెందునొక సామాన్యుండవో! "యిద్దికా
దవు"దంచేటికివాదు— నిక్కమగుతాతా! యింకరాబోవుగా!

మ॥ నినునిందించిన గర్భశత్రువునుగానీ—నీవు ప్రేమించినా
వనులే సవ్యము—గాక తక్కినవి మాయాకల్పనల్ ప్రేమజీ
వనులా వైదికమౌను లేమధుర నిర్వాణప్రపంచంబులం
దినవారో! యచటన్ సుఖింపుమిక—మౌని! సర్వకాలంబులన్

మ॥ సిరి మల్లెల్వలె వాతెరన్గమియు విచ్చెన్ నవ్వు—లా నవ్వులోఁ
బరమాత్మ్యుండె వసించె—నిర్దయతఁ బోవన్బాని తే పొమ్మ-భా
గ్యరమావంచితులైన మర్త్యులకు గాకల్ వెట్టి—నీగుర్తుగా
ధరపైఁ జల్లనిదొక్కనవ్వయిన తాతా! నిల్పిపోరాదుగా!

సీ॥ ఒకపల్లెటూరి వానికి సర్వలోకంబు
లిచ్చులోజోహారు లిచ్చెనంట
ఒకముదుసలి తాత వెకలినవ్వులయందు
నుపనిషత్తుల దావు లూరునంట
ఒకహరిజనుని పాదకమల రేణు ధా
రణకు దైవతకోటి వ్రాలునంట
ఒకదుప్పటంబు గప్పికొనిన సన్యాసి
చూపుల కై బ్రజతోపులంట

1 అవతారమౌనవును—విభూతికిని భేదమున్నది.
శ్రీ అరవింద సాహిత్యము దీనికి ప్రమాణము.
2 SEER "కవిర్మనీషీ పరిభూః స్వయమ్భూః" (ఈశోపనిషత్తు)
3 వృద్ధి—Evolution

జగతిఁదానొక్కఁడే రాముడుగజనార్ద
నుడుగ—క్రీస్తుగ-బుద్ధదేవుడుగ-దోఁచె;
నంట-మాయాలతో మాయ మయ్యెనంట-
నకట! మాతాత "యంటంట ల"య్యెనేఁడు

గీ॥ కనులు కాళ్ళులుగల్గి చిక్కఁగనునవ్వ
నట్టి పరమాత్మఁ దనపొట్టఁ బెట్టికొనియె,
మసలుగాకింక దుర్మదమతరథంబు
కళలు చితికిన యీవల్ల కాటియందు—

క॥ కలఁగనినానా! నిజముగ
నిలవీడెన! తాత—విడుచుటే నిజమన్నా
రలు దేవతలభ్రింబున—
ఝుళంఝుళద్వ్యోమయాన సరభసగతులై

గీ॥ హైందవులు దైవఘుణమన్న నంజలింతు
రనెడు కీర్తి కిఁదావు లేనట్లుగానె—
హైందవులకింకఁ "దాతయ్య"! యనెడునట్టి
నుడుల నమృతంబు లీనాటినుండి లేవు

గీ॥ తెరవెనుకఁ గూరుచున్నట్టి దేవుఁడొకఁడు
తెర కివతలాడు చుండిన దేవుఁడొకఁడు—
ఆటచాలించె నింక—మాయాఽభిభూత
కుతలమంతయుఁ జీకటి గుద్దులాట

క॥ అయయో! చిటచిట"మని" రే
డియో"లొ వినవచ్చె సవ్వడి హుతాశను డి
ట్లయినాడ! తనయాకలి
కయోగ్య శిథిల తనుదాహమా! తగునటరా!!

ఉ॥ వేలకు మైళ్లకవ్వల-పవిత్రము నీతనువగ్ని యేర్చెదుః
వేలకు మైళ్లకివ్వల-విభీషణకీలలు మేనగ్రమ్మి న
ట్లయి—లివలేని దేహమున లాచునుదాసము—నాకునీకు నే
పోలిక! యెంతపేమమునుఁ బూనితివోప్రభు! శుష్క జీవిపై

గీ॥ అమ్మ! మనతాత యికను లేడనుచు మూతి
ముడిచికూర్చున్న కొమరునిమోముఁ దుడుచు
తల్లికన్నులనిండ నిద్దంపునీరు—
పాపకన్నులనిండ జాపడిననీరు—

గీ॥ ఆటవస్తువులెల్ల చెర్లాడి పాప—
మెందుకో! యేడ్చు చున్నదాయింటిపడచు—
అర్థమయినాడా! తాత వ్యాఖ్యానములకు
నందనిది ప్రేమ—పరిశుద్ధ మైనమనసు

సీ॥ గుసగుసల్ మాటాడు కిసలయమా!
మూగనోము వట్టితి వేమిటే!!
చిలుపని తేనె చిప్పిలు కంఠమెత్తి
పల్కవదేమిటే! కోయిలమ్మ!!

"సొగసు మాదే!" నంచు మొగమెల్ల విచ్చి
తావులు జిమ్మ వేమిటే పువ్వ!!
మధుర మందస్వ రాంబుధి దేల్చిజగము
పాడ వదేమిరా! బాలపవన!!

గీ॥ ఎవరు మాటాడరేమి యేయింటియందు—
నఖిల జగమింతలో మాయమైనదేమి!
ఎవరు పల్కెడు పెద్దలేయింటియందు
తాత గతియించి పోయె—నాత్మస్వరూపి-

క॥ తాతా! ఓతాతా! ఓ
తాతా! యిదియేమి తీపి "తాత" పదములో!
తాతనుమించిన దైవము
భూతలమున లేదు—ముందు పుట్టనె బోదుః

గీ॥ రామమంత్రమ్ములో నైక్యమై—మహర్షి
యతఁడు వాల్మీకి రామైక్య మందినాడు—
తాత మంత్రంబులో నైక్యమై తపంబు
పండి—తేజస్సు నేనుగాపరిణమింతు

గీ॥ ఏలయేడ్తువె పిచ్చిదాన! లయంబు
తప్పదను మదిలేని వేదాంతిగాను—
అతఁడు చచ్చిన యీవ్యర్థ కుతలమందు
యింకబ్రతికినదెవ్వరే! యేడ్చుకొఱకు—

గీ॥ పత్రికలనిండ యూరార్పు భవ్యకీర్తి
గాన ముజ్వల సందేశ కలన—యెవ్వ
రెంతసందేశ మిచ్చిననేమి! తాత—
వచ్చునా! "రాజఘాట" త్రోవలనువిడిచి—

గీ॥ ఎవఁడో! యొకకవి పల్కె—నాఁడేద్ప ప్రియమ
టంచు నానాఁడు—వికటహాస్యంబుమనకు—
చెప్పుడీనాటి కెదలపైఁ జేయివెట్టి
యేమవు బ్రియంబుగాని దెవ్వాఁడు గలఁడో!

గీ॥ పావురాఱెక్క రంగుల భస్మమదిగో!
యదిగో! సుడులుగ లేచుచున్నది వియత్తికి—
ఔపనిషదంబయిన రహస్యార్థమెల్ల
భూతలము వీడినలిగాపు పోవునేమొ!!

క॥ యేమోయీ! తాతయ్యా!
యేమార్గము బట్టిపోతి వెచటికి—యింకీ
భూమికిదిగవా! పావన
గోమాతల కనులనీరు గుములుచునుండెన్

క॥ చరఖాసుదర్శనంబై—
యరిమురి మాయవ్వ లక్ష్మియై—కనుజూపుం
బరువులు గలశాబ్ధిగ నో
పరమాత్మా! లేచిరార! భక్తులఁబ్రోవన్

సీ॥ పలికెనా! మల్లెపూవులు కువ్వకువ్వ లే—
యమృతమే దిగజారినట్టులౌను
నవ్వెనా! జ్యోత్స్న సోనలు సోనలే పైని
హరిమాయలాడిన యట్టులౌను
కదలెనా! ధరకుఁ బుల్కలు పుల్కలే—కొల్ల
లరవిందములు విచ్చి నట్టులౌను
చూచెనా! నెమలికుచ్చులు గుంపుగుంపులే
యనురాగమే చిల్కినట్టులౌను

గీ॥ ఒకమహాజ్యోతి యాకారమూనివచ్చి
తిరిగి—తిరిగినయట్లె కన్మొఱఁగిపోయె—
యాసుధాలోక వినివర్థనాంధమైన
వసుధకింక క్రియా పరత్వంబులేదు

క॥ ఓయీ! మహాప్రభూ! నీ
పోయినపోక బట్టిపోయినవారే—
మాయయు మచ్చయు లేని య
మాయకు లితరులు మనస్సుమారినవారల్

గీ॥ చావు బుట్టుక లే ప్రపంచంబు—దాని
కెంత విలపించినా—లాభమింత లేదు—
బ్రతికి జచ్చినవారు కొల్లలకుగలరు
చచ్చిబ్రతికినవారు నిజానికొకఁడు

క॥ ఏమయినదో! యీమానస
మేమాటలకైన వెగలదే! కంఠం బా
లే! మాటల కందునవా!
యామహనీయుని వియోగమందలి చిచ్చుల్

చ॥ పులులను సాదుచేయు టనుభూతముగానిది రాచపుట్టువుల్
పులులను సాదుచేసితివి—భూతదయా పరితప్తిరీష పే
శలములు నీదుచూపులు—దృషత్తును బోలినగుండెలోతులం
దొలిచిన వెంతవాడిగలదోయి! మహాత్ములకెవ్వి సూత్రముల్;

సీ॥ ఒకనాడు జగమెఱుంగక వెఱ్ఱివేషాల
వగలుపోయిన పిల్లవాడటంచు—
ఒకనాడు మతపంథలకు రాజకీయంబు
లకు ముడివెట్టు నల్లరియటంచు—
ఒకనాడు మేకపాలకు స్వరాజ్యముదెత్తు
ననితొడంగిన "వెంగళయ్య"యనుచు—
ఒకనాడు తనుపాఱు చికిలినవ్వుల మచ్చు
గలిపినవ్వేడు మంత్రికాడటంచు—

గీ॥ తలఁచినది—లోకమానాడు తెలిసికొన్న
దతని యుగములనోము బ్రహ్మాత్మకముగ—
దెలిసికొన్నంత దైవంబు నిలువదేమొ!
మాయమయినాడు మాతండ్రి! మరలిరాడు—

మ॥ ఎవఁడో యొక్కఁడుఁజంపినాడనిగదా! యీగోల భూలోకమా
నవులంతా నిను జంపనట్టు! లోకయీనాడేమి! సృష్ట్యాదిపా
శవలోకంబు మహాత్మ రక్తముకు తృష్ణాబద్ధ-మీత్రోవఁద
ప్పవు దేశంబు లికెన్ని భేదములు భావాధ్వంబులన్ గల్గినన్!!

సీ॥ హరిజనుండన్న కన్నని! తీండ్రిపడు సనా
తనగోష్ఠి తాత హంతకులుగారొ!
మతవీధులందు ప్రేమశరీరమురిదీసి
నట్టి—దిచ్చర్లు హంతకులుగారొ!!
ఖద్దరునీడ లోకము కన్నుమూసి—బూ
టక మాడువారు—హంతకులుగారొ!!
పగబట్టి బీదమ్రూలుగు పైని—సౌధ సం
తతి గట్టువారు హంతకులుగారొ!!

గీ॥ ఎవరు తక్కువ మొనగాండ్రి మింకు! అంద
రందరే!! "నీవు నీవ"ని యాడనేల!!
నలువదియుకోట్ల బాకుపోటులకు నలిగి
పోయినది యాత్మ—మరలి రాబోదు మనకు!!

శా॥ పాయల్ పాయలొనర్చి పంపిన చితా భస్మంబు నానానదీ
తోయంబుల్ గ్రసియించినంతనె—సముద్ధూతంబుగాఁబోవరా
దాయుక్తాత్ముని జీవముల్ల్గొనిన వేదాంతంబు నవ్యారుణ
శ్రీ యై—భారత భావిలోకముల భాసింపఁగఁజేయన్వలెన్-

శా॥ ఏదోదేశము—దానిభాగ—మమలందింపై—స్వజాతీయ హృ
న్మాధుర్యంబు సహింపనేరనిది యంధత్వంబుమాయనన్వలెన్
శ్రీ దారిద్ర్యముకన్న మానసిక దారిద్ర్యంబు ఘోరమ్ము-మే
ధాధారేయులు పెద్దలింకయిన సుంతన్ కండ్లు విప్పన్వలెన్

మ॥ పరదేశంబులు—తచ్చరిత్రములు—భావగ్రంథులన్ నింపికొం
దురు-"మాదేమ"ని దుమ్ముమల్పరు దరిద్రుల్-విజ్ఞులైనట్లిము
ష్కరవాదంబు లొనర్తు రాప్రభువులింక న్నిద్రచాలించినం
దరముల్ మాతృపదాబ్జ జాతములు నిధ్యానంబొనర్పన్వలెన్.

గీ॥ ఆరిపోవని వెలుగైన యామహర్షి
యాత్మదీపంబు వలెనె—నిత్యప్రసన్న
మై—భరతదేశకీర్తి పొంగారుగాత—
యిలనుగప్పిన క్రొత్త వెన్నెలలపొంగు—




Desabandhu Press, Tadpatri, A. 20 C, 1000 30-3-48.